**అమ్మలోని అనురాగం నేను**

నాన్నకు అపురూపం నేను

అమ్మలోని చక్కదనం నేను

నాన్నలోని చురుకుదనం నేను

అమ్మలోని ఆత్మీయత నేను

నాన్నలోని గాంభీర్యత నేను

అమ్మలోని ప్రావీణ్యత నేను

నాన్నలోని ప్రాధాన్యత నేను

అమ్మలోని దీప్తిని నేను

నాన్నలోని వ్యాప్తిని నేను

అమ్మలోని బంధం నేను

నాన్నలోని అభయం నేను

అమ్మలోని భక్తిని నేను

నాన్నలోని శక్తిని నేను

అమ్మలోని యుక్తిని నేను

నాన్నలోని ఆసక్తిని నేను

అమ్మలోని ప్రశాంతం నేను

నాన్నలోని ఆసాంతం నేను

అమ్మ రక్తమాంసాల రూపం నేను

నాన్న చెమటచుక్కల ఆనందం నేను

అమ్మలోని చింతను నేను

నాన్నలోని స్వాంతన నేను

అమ్మ ఆలోచన నేను

నాన్నలోని ఆచరణ నేను

అమ్మ లోకానికి ఇచ్చిన

సంస్కృతి పరిరక్షణ నేను

నాన్న జగతికి చేసిన

సమసమాజ కలన నేను

అమ్మ లోకానికి ఇచ్చిన

సంస్కృతి పరిరక్షణ నేను

నాన్న జగతికి చేసిన

సమసమాజ కల్పన నేను

రచన : బుర్రా వెంకటేశం IAS ఆఫీసర్